









# శ్రీ మత్స్య మంత్రః - యంత్ర ప్రతిష్ఠావిధిః

హరిః ఓం

శ్రీ మత్స్య మంత్రః - హంస అజపాగాయత్రి - దృగ్ద్రుశ్యరూప దానినుండి "సోహం" - ఓం వాచ్యము అక్షర బ్రహ్మముగా ఉద్భవించును కావున ప్రాణప్రతిష్ఠా విధి లిఖింపబడినది. పంచామృతముతో యంత్ర శుద్ధి చేయవలయును. తదుపరి పీఠపూజ, నవగ్రహారాధన, కలశస్థాపన, యంత్రప్రాణ ప్రతిష్ఠ పురుషసూక్త విధాన పూజ జరిపి మంత్రానుష్ఠానము చేయవలయును.

## ప్రాణప్రతిష్ఠా వివరణము :

అస్యశ్రీ ప్రాణ ప్రతిష్ఠా మంత్రస్య - బ్రహ్మ విష్ణు మహేశ్వరా ఋషయః
ఋగ్యజుస్సామాథర్వాణి ఛందాంసి - పరాప్రాణ శక్తిర్దేవతా
ఆం బీజం - హ్రీం శక్తిః - క్రోం కీలకం - సర్వాంగే । స్వశరీరే ।
మూర్త్యైవా ।

యంత్రప్రాణ ప్రతిష్ఠాపనే వినియోగః

## తత్ర ఋష్యా దిన్యాసః

బ్రహ్మావిష్ణు మహేశ్వర ఋషిభ్యోనమః- శిరసి
ఋగ్యజుస్సామాథర్వఛందోభ్యోనమః - ముఖే

ప్రాణశక్తి దేవతాయైనమః - హృదయే

ఆం బీజాయనమః - గుహ్యే

హ్రీం శక్త్యైనమః - పాదయోః

క్రోం కీలకాయనమః - సర్వాంగే

ప్రాణ ప్రతిష్ఠాపనే వినియోగః

1. ఓం ఆం, హ్రీం, క్రోం, - అం, కం, ఖం, గం, ఘం, ఙం ఆం - ఓం, క్రోం, హ్రీం, ఆం, పృథి వ్యాప స్తేజోవాయు రాకాశాత్మనే... అంగుష్ఠాభ్యాం నమః (హృదయాయనమః)

2. ఓం ఆం, హ్రీం, క్రోం, ఇం, చం, ఛం, జం, ఝం, ఞం, ఈం, క్రోం, హ్రీం, ఆం, శబ్ద స్పర్శ రూపరసగంధాత్మనే....... తర్జనీభ్యాంనమః (శిరసే స్వాహా)

3. ఓం ఆం, హ్రీం, క్రోం, ఉం, టం, ఠం, డం, ఢం, ణం - ఊం, క్రోం, హ్రీం, ఆం, శ్రోత్రత్వక్ చక్షు జిహ్వాఘ్రాణాత్మనే - మధ్యమాభ్యాం నమః (శిఖాయైవషట్)

4. ఓం ఆం, హ్రీం, క్రోం, ఐం, - తం, థం, దం, ధం, నం - ఐం, క్రోం, హ్రీం, ఆం వాక్పాణి పాదపాయూపస్థాత్మనే... - అనామికాభ్యాం నమః (కవచాయహుం)

5. ఓం ఆం, హ్రీం, క్రోం - ఓం, పం, ఫం, బం, భం, మం, ఔం, క్రోం, హ్రీం, ఆం వక్తవ్యాదానగమన విసర్గానందాత్మనే .... కనిష్ఠికాభ్యాం నమః (నేత్రత్రయాయవౌషట్)

6. ఓం ఆం, హ్రీం, క్రోం - అం, యం, రం, లం, వం, శం, షం, సం, హం, క్షం - అః, క్రోం, హ్రీం, ఆం మనోబుద్ధ్యహంకార విజ్ఞానాత్మనే - కరతలకరపృష్ఠాభ్యాం నమః (అస్త్రాయఫట్)

ధ్యానం: రక్తాం బోధిస్థపో తోల్లస దరుణ సరోజాధి రూఢాకరాబ్జైః
పాశం కోదండ మిక్షూద్భవమథగుణ మప్యంకుశం పంచబాణాన్
బిభ్రాణాసృక్కపాలం త్రినయన లసితా పీనవక్షోరుహాఢ్యా
దేవీ బాలర్కవర్ణా భవతు సుఖకరీ ప్రాణశక్తిః పరానః

ధ్యానం: చత్వారి వాక్పరి మితాపదాని తాని విదుర్బ్రాహ్మణా యే మనీషిణః ।
గుహా త్రీణి నిహితా నే జ్గయన్తి తురీయం వాచో మ నుష్యా వదన్తి ।

ఇతి జప్త్వా

ఓం, లం, పృథివ్యాత్మకం ప్రాణశక్త్యై గంధం కల్పయామి
ఓం, హం, ఆకాశాత్మకం ప్రాణశక్త్యై పుష్పం కల్పయామి
ఓం, యం, వాయ్వాత్మకం ప్రాణశక్త్యై ధూపం కల్పయామి
ఓం, రం, వహ్న్యాత్మకం ప్రాణశక్త్యై దీపం కల్పయామి
ఓం, వం, అమృతాత్మకం ప్రాణశక్త్యై నైవేద్యం కల్పయామి
ఓం సం సర్వాత్మకాన్ ప్రాణశక్త్యై సర్వోపచారాన్ కల్పయామి

ఇతి పంజపూజాం కృత్వా

1. ఓం, ఆం, హ్రీం, క్రోం, అం, యం, రం, లం, వం, శం, షం, సం, హం, క్షం, అః క్రోం, హ్రీం, ఆం, హంసః సోహం – మమప్రాణ ఇహప్రాణాః

2. ఓం, ఆం, హ్రీం, క్రోం, అం, యం, రం, లం, వం, శం, షం, సం, హం, క్షం, అః క్రోం, హ్రీం, ఆం, హంసః సోహం – మమ జీవ ఇహస్థితః

3. ఓం, ఆం, హ్రీం, క్రోం – అం, యం, రం, లం, వం, శం, సం, హం, సం, హం, క్షం, అః క్రోం, హ్రీం, ఆం, హంసః సోహం – మమ సర్వేంద్రియాణి

4. ఓం, ఆం, హ్రీం, క్రోం – అం, యం, రం, లం, వం, శం, షం, సం, హం, క్షం, అః క్రోం హ్రీం ఆం హంస స్సోహం మమవాఙ్మన శ్చక్షు శ్రోత్ర జిహ్వాఘ్రాణ

ప్రాణా ఇహాగ త్య స్వస్థయే సుఖేన సుచిరం తిష్ఠంతు స్వాహా... (పైన నాలుగు వాక్యాలు మూడు సార్లు జపించవలయును.) ఇతి శిరసి హృది వా, కరం దత్వాత్రిః సకృద్వాజపిత్వా

"ఓం అసునీతే పునరస్మాసు చక్షుః పునః ప్రాణ మిహనో ధేహి భోగమ్ జ్యోక్ పశ్యేమ సూర్య ముచ్చరంత్త మనుమతే మృళయానః స్వస్తి"

(పై మంత్రము పదిహేను సార్లు చెప్పవలయును.)

గర్భాధానాది పంచదశ సంస్కార సిద్ధ్యర్థం పంచదశ ప్రణవావృత్తిం కరిష్యే ఓంకారం పంచదశవారం జపేత్. ఇతిప్రాణ ప్రతిష్ఠా

"ఓం ఆంహ్రీం క్రోం ఆం హంసః – లం వం రం యం హం హంసస్సోహం – స్సోహం హంసః హంసహంసాయ విద్మహే పరమ హంసాయ ధీమహి తన్నోహంసః ప్రచోదయాత్"

## శ్రీ మత్స్య మంత్రః

యంత్రశుద్ధి పంచామృతముతో చేయవలయును. తదుపరి కలశపూజ, మండపారాధన యంత్ర ప్రాణప్రతిష్ఠ – పురుషసూక్త విధానపూజ జరిపి మంత్రానుష్ఠానము చేయవలయును. (యంత్ర రాజాయ విద్మహే వరప్రదాయ ధీమహి తన్నోయంత్రః ప్రచోదయాత్ యంత్రగాయత్రి)

అస్యశ్రీ మత్స్య మహా మంత్రస్య – పరబ్రహ్మాఋషిః
దేవీగాయత్రీ ఛందః శ్రీమత్స్యస్వరూపీ హరిర్దేవతా
మం బీజం, నమఃశక్తిః, మత్స్యరాజాయేతి కీలకం

గృహేశోభన సమృధ్యర్థే – సర్వవాస్తు దోషపరిహారార్థే జపే వినియోగః

ఓం హ్రాం అంగుష్ఠాభ్యాం నమః

ఓం హ్రీం తర్జనీభ్యాం నమః

ఓం హ్రూం మధ్యమాభ్యాం నమః

ఓం హ్రైం అనామికాభ్యాం నమః

ఓం హ్రౌం కనిష్ఠికాభ్యాం నమః

ఓం హ్రః కరతలకరపృష్ఠాభ్యాం నమః

ఓం హ్రాం హృదయాయ నమః

ఓం హ్రీం శిరసే స్వాహా

ఓం హ్రూం శిఖాయై వషట్

ఓం హ్రైం కవచాయ హుం

ఓం హ్రౌం నేత్రత్రయాయవౌషట్

ఓం హ్రః అస్త్రాయఫట్

భూర్భువస్వరోమ్ – ఇతిదిగ్బంధః

ధ్యానమ్: మత్స్యాసనం హరిం దేవం శంఖచక్రధరం విభుం

సర్వాభరణ సంయుక్తం శ్రీభూనీలాధిపంభజే

| | | | |
|---|---|---|---|
| లం | పృధివీతత్వాత్మనే | గంధం | పరికల్పయామి |
| హం | ఆకాశతత్వాత్మనే | పుష్పం | పరికల్పయామి |
| యం | వాయుతత్వాత్మనే | ధూపం | పరికల్పయామి |
| రం | తేజస్తత్వాత్మనే | దీపం | దర్శయామి |
| వం | అమృతతత్వాత్మనే | అమృతం | నివేదయామి |
| సం | సర్వత త్వాత్మనే | సకలోపచార పూజాం సమర్పయామి | |

## గురుధ్యానమ్

గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ - తస్మై శ్రీ గురువేనమః

## మనుః

ఓం, ఆం, హ్రీం, క్రోం, మం, మత్స్యరాజాయ నమః

(జపసంఖ్య దశ శతాంశ హోమ తర్పణములు) జప ఫలము భగవదర్పణము. (జపం వెయ్యి, హోమం నూటఎనిమిది, తర్పణము పది, విధి విధానము)

## మంత్రగాయత్రి

మత్స్యరాజాయ విద్మహే - మహామత్స్యాయ ధీమహి
తన్నో మత్స్యః ప్రచోదయాత్ ॥ (దశదిశవ్యాపకార్థే వినియోగః)

(జపం, పదివేలు, హోమం. జపదశాంశం వెయ్యి, తర్పణం హోమదశాంశం వంద, మార్జనం తర్పణ దశాంశం, పది, బ్రాహ్మణ భోజనం మార్జనదశాంశము - ఒకటి)

పునః అంగన్యాస కరన్యాసా దికం కృత్వా
భూర్భువస్సువరోమితి దిగ్విమోకః
గుహ్యాతిగుహ్యాగోప్తాత్వం గృహాణాఽస్మత్కృతం జపం ।
సిద్ధిర్భవతుమే దేవ త్వత్ప్ర సాదాదృషీశ్వర । జపఫలసమర్పణ
యంత్రగాయత్రి చేయవలయును.

యంత్ర శుద్ధి - యంత్రస్థాపన - ప్రాణప్రతిష్ఠా - మండపారాధనలు - పురుషసూక్త విధానముతో పంచామృతస్నానము పూజ జపమునకు పూర్వము

జరిపి జపము చేయవలయును. స్మార్తవిధంగా కలశారాధన వగైరా పూర్తి చేయవలయును. ప్రతిష్ఠదినమున పురుష సూక్త విధి పూజ చేసి స్థాపన ఉత్తరముఖముగా నుండునట్లు ద్వారబంధపైభాగమున ఈశాన్యమూల తూర్పుభాగమున జరుపవలెను.

నోట్: యంత్రమునందు మన్త్ర విస్తృతరూపము లిఖింపబడినవి. ఆ మంత్రములునూ ఆచరణీయములే అంగన్యాసకరన్యాసములు, ధ్యానములును హ్రీం బీజాక్షర విన్యాసములే. మార్పుచేయనవసరము లేదు. ఇది లోక వ్యవహారమునకు మాత్రమే వినియోగము.

మన్త్రం: ఓం ఐం హ్రీం శ్రీం మత్స్యాసనాయ సోమకాసుర భంజనాయ మహావిష్ణవే అణిమాద్యష్ట విభూతిం దేహిదేహి స్వాహా (వెయ్యి)

మంత్రగాయత్రి । తత్పురుషాయ విద్మహే మహామీనాయ ధీమహి ।
తన్నోవిష్ణుః ప్రచోదయాత్ ॥

ఇది ఐచ్ఛికము : మం అను మూల బీజాక్షర విస్తృతరూపమే మంత్రపదము. మూల మంత్రం లోగడ వివరించినది పంచబీజాక్షర – పంచాక్షర మంత్రరాజము. దశదిశవ్యాప్తిగలది గావున ప్రాధాన్యముగలదిగానున్నది.

(ఓం ఆం హ్రీం క్రోం మం మత్స్యరాజాయ నమః)

ఇతి శ్రీ వెంపటి వేంకట సుబ్బశాస్త్రి గురువర్యైః ప్రోక్త మత్స్య మంత్ర, యంత్ర ప్రతిష్ఠా విధిః సమాప్తః

⋆⋆⋆







